శ్రీ రస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# భీమసేనవిలాసము,

## యక్షగానము.



ఘ అండు కంపెని వారి

సుందు ముద్రాక్షరశాలయందు

ంపించి ప్రచురింపబడినది.

చెన్నపట్టణము.

0-3-0

శ్రీ ర స్తు.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# భీమసేన విలాసము.

## యక్షగానము.



ఇది,

వెస్టువార్డు అండు కంపెని వారిచే

[illegible] డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె

చెన్నపట్టణము.

1936.

# నాటకములు, యక్షగానములు.



| | |
|---|---|
| దే-విరాటనాటకము | 0-4-0 |
| విభీషణపట్టాభిషేకనాటకము | 0-4-0 |
| శ్రీమత్తిమ్మలపంతుల ద్రౌపతీకల్యాణనాట | 0-4-0 |
| సైంధవపరాభవ నాటకము | 0-2-0 |
| చుక్కలూరు రామ నాటకము | 0-4-0 |
| కుచేలోపాఖ్యాననాటకము | 0-8-0 |
| [illegible]రామాయణ నాటకము | 0-4-0 |
| మట్టిగుంట శశిరేఖాపరిణయనాటకము | 0-8-0 |
| చెంచునాటకము | 0-1-0 |
| ద్రౌపతివస్త్రాపహరణ నాటకము | 0-2-0 |
| నలచక్రవర్తి నాటకము | 0-8-0 |
| సారంగధరనాటకము | 0-1-0 |
| మాయలమల్లినాటకము | 0-1-0 |
| గయోపాఖ్యాననాటకము | 0-4-0 |
| సత్యహరిశ్చంద్రనాటకము | 0-3-0 |
| మైరావణనాటకము | 0-6-0 |
| ధర్మాంగదనాటకము పాలుట్లలక్ష్మి | 0-3-0 |
| సంత వేలూరు రామనాటకము | 0-12-0 |
| వీరభద్రనాటకము | 0-8-0 |
| చిత్రాంగినాటకము | 0-6-0 |
| వేముల ఉషాపరిణయనాటకము | 0-2-0 |
| వే-విరాటపర్వనాటకము | 0-4-0 |
| బే-హరిశ్చంద్రనాటకము | 0-4-0 |
| లేపాక్షి కృష్ణజలక్రీడనాటకము | 0-2-0 |
| రామానుజ ప్రహ్లాదనాటకము | 0-4-0 |
| తిరునారాయణ ప్రహ్లాదనాటకము | 0-4-0 |
| సుబ్బకవి ప్రహ్లాదనాటకము | 0-2-0 |
| మట్టినగర సావిత్రినాటకము | 0-4-0 |
| సత్యభామకల్యాణనాటకము | 0-8-0 |
| రామనాటకము | 0-8-0 |
| పురూరవ జననాటకము | 0-2-0 |
| అనిరుద్ధనాటకము | 0-8-0 |
| మార్కండేయనాటకము | 0-8-0 |
| వెలిగండ్ల వీరవిజయవిలాసనాటకము | 0-2-0 |
| చంద్రసేనమహారాజునాటకము | 0-4-0 |
| విప్రనారాయణ యక్షగానము | 0-4-0 |
| ధర్మాంగదరాజు ,, | 0-8-0 |
| చిరుతొండ ,, | 0-8-0 |
| హరిశ్చంద్ర ,, | 0-2-0 |
| శిరియాళ నాటకం ,, | 0-2-0 |
| రుక్మాంగదనాటకం ,, | 0-2-0 |
| గౌరీశంకరవిలాసం ,, | 0-2-0 |
| రామదాసుచరిత్ర ,, | 0-8-0 |

## జంగంకథలు.

| | |
|---|---|
| చిన్నప్పరెడ్డి కథ | 0-1-0 |
| కాంభోజరాజు కథ | 0-1-6 |
| పెద్దబొబ్బిలిరాజు కథ | 0-4-0 |
| బాలనాగమ్మ కథ | 0-3-0 |
| అంబరీషోపాఖ్యాన జంగంకథ | 0-8-0 |
| విరాటపర్వం జంగంకథ | 0-3-0 |
| గయోపాఖ్యానం జంగంకథ | 0-2-0 |
| చిన్నమ్మ కథ | 0-1-6 |
| లక్ష్మమ్మ కథ | 0-1-6 |
| కామమ్మ కథ | 0-2-6 |
| దేవయాని చరిత్ర జంగంకథ | 0-2-0 |
| భల్లాణ జంగంకథ | 0-2-0 |
| రుక్మిణీకల్యాణం జంగంకథ | 0-2- |
| శిరియాళ జంగంకథ | 0-2- |
| గాంధారి కథ | 0-3- |
| దేశింగురాజు కథ | 0-8- |
| బంగారు తిమ్మరాజు కథ | 0-1- |
| వామనవిజయం జంగంకథ | 0-2- |

వెస్టువార్డు అండు కంపెని,
చాకలపేట, మదరాసు.



శ్రీ కురుమూర్తి వేంకటేశాయ నమః

శ్రీ కుందనగిరి పరమేశాయ నమః

# భీమసేనవిలాసం - యక్షగానము.



క॥ శ్రీలాలిత నవమూర్తిక । మాలాయుతకలిత శ్రీరమాయుతవక్షా ।
చాల ప్రార్థించెదయిల । మేలుపు కురుమూర్తి శరణ వేంకటరమణా॥

దరువు॥ శ్రీరామారమణీమనోహరాసింధుగంభీర - పారావారాభక్త లోకోపకార॥ శ్రీ॥ కామితఫలదాయకా గౌరీశసఖ - సామాజాధిప పోషకా సద్గుణానే॥ శ్రీ॥ ద్రౌపతిమానాభిరక్షా దైవద్యుతాక్షా - పాపారాక్షస శిక్షాపాలితాపాండవపక్షా॥ శ్రీ॥ సురముని పూజితాచరణా సుందార - కరుణాకరకురుమూర్తి వేంకటరమణా [illegible]॥ శ్రీ॥



## వినాయక స్తుతి.

దరువు.

శ్రీగిరిజావరపుత్రా శృంగారచారిత్ర - నాగవేష్టితగాత్ర బుధసంస్తుత స్తోత్ర॥ శ్రీ॥ రవికోటినిభ తేజ రమణీయపాదాంభోజ - నతజనకల్పక భూజా విఘ్నరాజా॥ శ్రీ॥ అఖిలాగమనిర్ణీత ప్రకటావిద్యా ప్రదాతఅఖిలా లోక స్తుతి ఆదిగణనాథా॥ శ్రీ॥ గురుతర శ్రీకురుమూర్తి గిరినుకందరపతిః - హారి స్తుతశరణార్థి తరిపాలకమూర్తి॥ శ్రీగిరి॥



## సరస్వతీ స్తుతి.

### దరువు.

దేవిభారతీవాగ్దేవివినుసతీ - తాపకపద సేవనొసగి ప్రోవవె శారదా సతీ॥ దేవి॥ విమలకమలసదృశ పాణిసుమనో సుతగుణశ్రేణి - అమితా... గేయవీణాసరణీరణిమమ దేహిసుప్రవాణి॥ దేవి॥ పలుకులందు ... లొలుకగవర మొసగుమందు - చెలువలరగ ప్రకృతమందు దలచితి ముందుముందూ॥ దేవి॥ స్థిరతరమగుకురుమతి భూధరనిలయుని ... జుని - తరుణీమణికరుణించవె సురుచిరమగువాక్యశ్రేణి॥ దే॥

## శక్తి స్తుతి.

### దరువు.

హిమగిరివరజాతా - హేమాత హిమ॥ ప॥ సుమ... గుణోపేత - మమాభీష్టఫలదాత మహితవిఖ్యాత॥ హి॥ ఘననిభవేణిక సుపాణి - వినమితమునిశ్రేణివినుతగీర్వాణి॥ హి॥ స్థిరశుభకారిశ్రితవన హారి - కురుమతిహారిసోదరీ కుజనవిదారి॥ హిమ॥

## సభాకైవారం.

శ్రీమద్రమారమణీ మనోహరునిజాంబూనదాంబరధారుని శంఖచక్ర... సందక ధారుని చతుర్భుజుని శ్రీకురుమూర్తి వెంకటేశ్వరుని పదపం... నిరంతర ధ్యానమానసుండైన శ్రీమంతు మహారాజాధిరాజ ముక్కర... సోమభూపాల్ రావు బలవంతుబహద్దరుగారి అర్ధాంగియైె దేశాయి వెంక తమ్మాంబావరగర్భోద్భవుండైన శ్రీమంతురాజాముక్కరవంశక్షీరపారావా రైన శ్రీసీతారామాభూపాల్ గారి ఆశ్రితుండనై నేను విద్వజ్జనసమూ బుల శిరసావహించి శ్రీ మహాభారతంబునంగల విరాటపర్వంబు ...

...చ్చి శ్రీకురుమూర్తి వెంకటేశ్వరునికి సమర్పణంబు చేయుచుఁ జూపినాఁడని తెలియవలసినది.

మాటలు. శ్రీమతు వనపర్తి సమస్థానం యిలాకాలో చేరిన రామకృష్ణాపురగ్రామనివాసుడగు శివపూజా ధురంధరుడైన వావిళ్ళవంశ పయః పారావార రాకాసుధాకరుండైన బుక్క లక్ష్మయ్యా హకీము కుమారుండగు సిద్ధాంతి అచ్చు వేయించిన గ్రంథాలవివరం: భీమసేనవిలాసము, తారాశశాంక నాటకము, తమ్మాజీ పేట హరిశ్చంద్ర నాటకము, మన్నెంకొండ హనుమద్దాసుచరిత్రము ద్విపద వాక్యము, యిన్ని గ్రంధములు స్వంత ద్రవ్యం ఖర్చు చేసి వేయించినవి, తెలియవలసినది.

ద్వి ప ద.

శ్రీకర వనపర్తి సీమలోపలను - ప్రాకటమ్మువహించు రామకృష్ణాఖ్య - పురమున వెలసె విభూతిచెన్నొంది - శిరికాటపట్టయ్యె చెలువొప్పనిలను - తత్పురవాసుడై దనరె వావిళ్ళ - కులపావనుఁడగు గుణగణ యుతుడు - సలలిత లక్ష్మయ్యా సాధ్వి రామాంబ - గర్భపావను డగుఘన ధురీణుండు - ...భరితకలుష సందర్భ వారుండు - విమల పంచాక్షరి వేదాంతినామ - సుమతుల కన్నమై సొంపొందు బలుడు - దానరాధేయుండు దాక్షిణ్య ...తుడు - మహిని సిద్ధాంతినా మహితుండు దనరు- లలినొప్ప భీమవిలాసంబుసచ్చు - కూర్పించె కీర్తిచే నేర్పొప్పగాను - కార్పణ్యములు లేనికవి జనులెల్ల - మెచ్చుచునుండ నిమ్మేదినియందు - సచ్చరిత్రు డని సరసాత్ము ...న్న - ప్రవిమల కురుమూర్తి పరమాత్మ కృపను॥

ద ర్వు.

జనమేజయుఁడాన కిట్లనియె వైశంపాయనుడుమునివరుడు తనమదిని ఘన మోద మొప్ప॥ సారది అజ్ఞాతవాసమునందు విరటుని పురమందు ద్రౌపతితరుణీ మణికొరకె॥ గురిమీరగా సాముగరడీలో భీముడూ తెరవరూపము నబురు గొనియొకీచకుని॥ పరిపూర్తిగా జెప్పతరముగా దెవ్వరికిని కురుమూర్తి వెంక టేశ్వరునకే తెలుసుఁ॥

మాటలు. అనిన వైశంపాయనునికి జనమేజయుం డిట్లనియె. మునీంద్రా నీ మృదుమధుర భాషణంబులు వినగోరెద, సవిస్తరముగా దెలుపుమనిన వైశంపాయనుం డిట్లనియె.

కథా ప్రారంభము.

క॥ పటుకతో డుత కౌరవు। లాడిరి జూదములు సప్పు డవనీ స్థలముఁ।
వోడిరి పాండవు లేవ్వరు। వేడమించెడి సతియుదాము పోయి రడవికిఁ॥

ద ర్వు.

కోరికౌరవా పాండవులూ - ఆడిరి జూదములూ - పిరాని కట్టిదవుఃఖములా వేలుల కోలుకౌ॥ కోరి॥

వ ర్ణ న.

యాకౌరవులూ - యాపాండవులూ - జూదములూ ఆడిరి దొరలు - వోడిరి వారలు॥ కిడ్క॥

మా ట లు.

గజతురగరథాందోళిక ఛత్రచామరాదులు ధనకనకములయిన సామ్రాజ్యము లెల్లను వర సింహాసనమున్ను కూడ జూదమందు జయించిన వారల కొప్పగించి, పన్నెండు వత్సరంబులు అరణ్యవాసమున్ను, ఒక సంవత్సరము అజ్ఞాతవాసమున్ను పోవలసినదని యీతీరు వాడిరి వినుమా జనమేజయమహారాజ అఖనునుమా.

ద ర్వు.

మదగజారథావళులూ - సుదతిమణులు హా వదలి పన్నెండు వత్సరములూ- అజ్ఞాతవాసమొకటి పదమూడబ్ధమూ లీతీరు పోలినవారు॥

వ ర్ణ న.

మదగజములూ - మదగజములూ - రాజ్యములూ - సుతసతీమణులూ - దాసీజనులూ - పరసేవకులూ - మంత్రిజనులూ దండోదరులూ॥ కిడ్క॥

మా ట లు.

యీతీరున ధర్మరాజు శకుని జేయు మాయ కృత్యంబు తెలియక వోడినవారై యేదియుం దెలియక.

ద ర్వు.

మగధచ్ఛిభారాయునియాడ - పాచికలతోడా - పగబూని శకునితో నాడా ధర్మజతోడా। కోరికౌరవా॥

వ ర్ణ న.

మగధచ్ఛిభారా - యని యాటలాడా - పాచికలతోడ - ధర్మజుతోడ - తమ్ములతోడ - వేగమెజాడ॥ కిడ్క॥

మాటలు.

కడువడిగా జూదమాడవలెనని సహజమున యెడలెరుగక అత్యోడ్డపరవశుండై ధర్మజుడు చెడిపోదుననే తెలివి యుడిగి పడిన యనుజుల సహితంబుగ నోడినవాడై దుర్యోధనున కొప్పగించి యుండగా సిడిముడిగొని ద్రౌపతి ఝడిసి యోడినవారది నిజముగాదని యాజ్ఞజేసి పాచికలు కాలద్రాచి జూదమాడ నిల్పి యేవురి పతుల గెల్చి.

దరువు.

పరివారములూ యెడబాసీ వనవాసము జేసీ - కురుమూర్తి శోచీ దలచి తమ్ములజూచీ॥ కోరి॥

వర్ణన॥ కురుమతిరమణా - వేంకటరమణా - వేదోద్ధరణా - సన్మునిస్మరణా - ముక్తాభరణా॥ కిడ్క॥

మాటలు. సకలపరివారమను పృధివీమండలంబును మొదలైన సామ్రాజ్యంబును యెడబాసి మహావనవాసమును సాహసము జేసి పదిరెండు వత్సరంబులుగడపి తీరిన దినములు లెక్కజేసి పదిరెండింటదెలిసి అజ్ఞాతవాసమునకై యోచించి కురుమూర్తి గిరివరాధీశ్వరుని దలంచి విపినవాసము నిర్గమించె.

దరువు॥ తోంతతఝుణుదాధింతతఝుణుతాదిత్తాదిముతత॥

సూత్రధారుడు పిచారించు మాటలు. వచ్చినటువంటి వారెవరయ్యా స్వామి - హాహాకారా.

ధర్మరాజు వేషము రావడము.

మాటలు. ఈ చతుస్సముద్ర మధ్యమండలంబందు గర్వోత్కృష్టులైన దుష్టరాజాధిపతుల జయించి శంకించక నీకుంభినీశ్వరులద్రుంచి యీభూమండలంబు అంబికాతనూద్భవున కొప్పగించి చంద్రవంశాధిపతులలో అధికుడనై మించి విరాజిల్లి అంబాలికాసుతుడు సుజనమనోహితుడు దిఙ్మండలాధిపతి పాండురాజుయొక్క జ్యేష్ఠపుత్రుండను మా నామంబులు వినుము భీమా అర్జున నకులు సహదేవులు వినుము నేను యుధిష్ఠిరుండను రాజమాత సకలసుగుణోపేత.

భీమసేనుని వేషము రావడము.

మాటలు. వరెవరె యీ పృధివీ మండలంబున దోర్దండమండితరిపుయుద్ధమండలంబులకు ప్రచండమార్తాండస్వరూపుండనైనవైరిమదగజంబులకు

గండకేసరియైన చండకోదండంబుకు భార్యమందు గదాదండంబున మొదలార్చి యుద్దండదండంబుతోడ వెలసిన పాండుభూపతి పట్టంపు భార్యయైన కుంతీతనూద్భవుండనైన విజితవిక్రమ పరాక్రమాభిరాముండను భీముండను రాజదూత జగత్ప్రఖ్యాత.

## అర్జునుని వేషము రావడము.

మాటలు. ఈ ధరలో రిపుకులద్వీప సమూహంబులకు అకుంఠిత కంఠీరవుండవైన మేరుధీర పారావారాగంభీరసారా చమత్కారపరమోదార శృంగారకారుండనైన సవ్యసాచి కిరీటి భీభత్సు ధనంజయ విజయజిష్ణు శ్వేత వాహన ఫల్గున గాండీవి అర్జునుండను యీ పది నామంబులతో శ్రీ కృష్ణ పరబ్రహ్మ యనుగ్రహంబునకు పాత్రుండనైన దుర్జనుల నిర్జించు యర్జునుం డను రాజదూత పటుగుణసమేత.

## నకులుని వేషము రావడము.

మాటలు. వరె రాజదూతాగ్రణి యీ భూమండలములో ప్రఖ్యాతిచే స్వర్గమర్త్య పాతాళంబుల సూర్య వ్రాతంబునకు అధికుండనని ప్రసిద్ధి జెందిన శీతాంశులోద్భవులైన సుగుణసాంద్రుండనైన నకులరాజను వెలసితి వినుమా వెస తెలుసుకొనుమా.

## సహదేవుని వేషము రావడము.

మాటలు. యీ లోకమందు యిందుకులోత్పన్నులయిన రాజాధిపతులలో యుక్తుండనయిన సుకుమారసుందర షడ్రుచిరాంగ సౌందర్య సంపన్న సజ్జనుండను అతిప్రియముగలవాడయిన శ్రీ కృష్ణపరబ్రహ్మ నామ సహస్రంబులు నిరంతరంబు మనంబున ధ్యానించె విహిత సుగుణోపహారుం డను సహదేవుండను రాజదూతవిహిత విఖ్యాత.

## ద్రౌపతి వేషము రావడము.

రాగం - సాసాసాసారిససరీరీదపమగ.

సూత్రధారుడువిచారించుట వచ్చినటువంటివారెవరమ్మా వారికి ద్రౌపతి మాట. ఈ కుంభినియందు అంబుజసంభవజంబబేదిముఖ సుమనో విసరమునకు అంబరబింబాయమానుండయిన జాంబవతివరగుడు సుందరగిరి ధరుడు శంబరారిగురుడు జాంబూనదాంబరవరుడు విడంబమహిమగలవాడు శ్రీకృష్ణమూర్తి భృత్యులయిన పాండవుల కర్ధాంగినైన ద్రౌపతిదేవిని నా రాజదూత సుగుణవిఖ్యాత.



ధర్మరాజు యోచించుట.

దరువు॥ ధర్మరాజానృపుడూ - యోచించెనపుడూ॥ ధర్మా॥ దుర్మదమనుజులతో మెలగుటకై॥ ధర్మా॥ తొలిగెవిపిన వాసామెల్లా - నిలిచే నొక్కా అజ్ఞాతము హాహా॥ బలియులుశత్రులుకలత వెతుకుదురిక తెలియ గనుడు సుస్థలమెయ్యదియో॥ యోచిం॥

వర్ణన॥ యోచించెనపుడూ - యోచించెనపుడూ-తమ్ములకపుడూ- తెలిపెనపుడూ - ధర్మజూడూ॥ కిడ్కా-తోకిణుతకఝుణుతా.

మాటలు. భీమార్జున నకులసహదేవాదులువినుడి ఈసమయమందు మననామరూపంబులుదాచుకొని యుండుటకు స్థళము కనపడలేదు ఎటుందు కనిన యీపశ్చిమ దిగ్భాగమందు నిశ్చయముగా కర్ణవికర్ణులు భూమేలుచున్నారు యీతెగాక ప్రాగ్దేశము మగధాదులు బ్రోతురు, మహాశూరులయిన కురురాజులు ఉత్తరదిశ పాలించుచున్నారు, మన ముండుటకు స్థళము యెక్కడ గలదు, అజ్ఞాతవాసమునకు యోచించి చూడదగినది మీ మనసులో నున్నది.

ఇందు భీముడనే దరువు॥ యోచించగాయేలా మనకు - చూచిందాయా తెలియమీకుహాహా॥ దాచుకదగినవిరాటునిపురమున - కీచకునిభయముకు వెరతురు కౌరవులు॥ ధర్మా॥

వర్ణన॥ అన్నయ్యాయోచన - యేలాయోచనా - యెంగుకీయోచన- సీమనసూ - తెలియాయోచనా॥ కిడ్కా॥

మాటలు. హేఅన్నయ్యా యిక్కడికి దక్షిణ దిగ్భాగమందు మత్స్యపుర మనే నగరమందు బలవంతుడైన కీచకుని బలముచేత అక్కడికి ధార్త

శాస్త్రులు రానేరరు నాయొక్క మాట మన్నించి అక్కడికిపోవుట వుచితము గాదా తెలియరాదా.

దర్వు॥ ధరణీసురుడాధర్మజూడా - వలలూడంద్రమా భీముహాహా
వరుడుబృహన్నలతురగ గోపతులుశ్రీ - కురుమాలిహారిక్రపసరమా ద్రిజా త్రై॥



ద్రౌపతి ధర్మరాజుతో అనే దర్వు.

ఘనమూగనుదీనియోచనజేయుటదియేమోవినగా దెల్పుముధర్మజా-
కాంతావినగాదెల్పుము ధర్మజాహాహా॥ ఘనపరాక్రమూభీమార్జునులాయుకు
పురునుండ॥ ఘన॥

వర్ణన॥ కాంతాయోచనా - పతీయేయోచావా - యెందుకీయో
చానా - యెక్కడిదియోచవా పాపమోచనా॥ కిడ్క॥

మాటలు. హే ధర్మరాజా తాము అజ్ఞాతవాసముకై ఆలో
చన చేయుచున్నట్లు తోచుచున్నది హే కాంతా సద్గుణవిశ్రాంతా.

దర్వు॥ అనుజూలుత్రిభువనామూలయందువిజయూలుగా - అనగన
మునువినవా - అనువొందమీయాజ్ఞాగాని - యెంతపనియైనగాక్షణమునకో
పలదీర్తురూహా॥ ఘ॥

వర్ణన॥ విడువిడుకాంతా - విడువిడుకాంతా - నీమదిచింత - జే
యగకొంత - యాలనెవింత - యాశ్రమముంత - దగిలెనుస్వాంత - అయ్యో
భగవంత - రుక్మిణి కాంత॥ కిడ్క॥

మాటలు. ఇదిగాక మీ అనుజులు భీమార్జున నకుల సహదేవులు

మహాబల పరాక్రమవంతులు త్రిలోకములయందు విజయము గలవారలై యుండగ యోచించ నేటికి మునూర్తికి॥

దరువు॥ పది రెండు యేండ్లు యీ పగిది కాననమందు యెదిగిన్రుండిన వేళలో - తదవాసమునా యేదైనారక్షించె తుదకు మానవపతి తోడుమీగా కుండగా॥ ఘన॥

వర్ణన॥ పదిరెండేండ్లు - పదిరెండేండ్లు - కాననమందు వుంటిమి ముందూ - అనుదినమందూ - హరిగోవిందూ - కృపతోనందు యీస్థల మందు - కృపయుంచు ముందూ॥ కిడ్క॥

మాటలు. అంతేగాక యీఅరణ్య వాసమునందు పన్నెండు యేండ్లు యే మహానుభావుని యనుగ్రహంబుచే కడతేరితిమో తుదకు అజ్ఞాతవాసము నొక సంవత్సరమును నా శ్రీ కృష్ణపరబ్రహ్మమూర్తియే పరిపాలించ గలడు నిజముని తెలియుడీ నామాట వినుడీ.

దరువు॥ కరిరాజు మొరవిని హరియాతా చనుదెంచి - కరుణాతోడుత బ్రోవడా - పరమ భక్తుడనీవు హరిపాలన సేయగా కురుమూర్తి హరి గలడూ మనకిపుడూ॥ ఘన॥

వర్ణన॥ దయరాదా - కాంతా దయరాదా - యిది మరియాదా వేడగలేదా - ప్రేమయు లేదా॥ కిడ్క॥

మాటలు. ఇంకొ వక్క మాట వినుము గహనమునకు కరిరాజు మకరిచే జిక్కి శ్రమనొంది హరినిగూర్చి మొరసేయగా అతి త్వరితముగా వచ్చి మకరి శిరము ద్రుంచెను తామైతె భగవద్భక్తి గలవారలు పరమ భాగవతోత్తములు మిమ్ము పరిపాలన సేయుట ఆశ్చర్యము గాదు. ఆ యోచన సేయగూడదు.



విరాటరాజు వేషము రావడము.

పుత్రపౌత్రసహిత మాటలా, వచ్చినటువంటి వారెవరయా స్వామి కాళీశా.

విరాట్రాజు మాటలు

పరేవరే రాజదూతాగ్రణీ క్షత్రియ సముదాయమునకు భయం కరుడైన యీ ధాత్రియందు క్షత్రియులలో నుత్తముడనైన వాజీవారణ స్యందనాందోలిక ఛత్ర చామరాదులచేతను శోభితుండనైన యీమత్స్య నగరమునకు అధిపతినైన విరాట భూవరుడను గానా రాజదూతా పటుగుణ సమేత॥

సుధేష్ణ వేషము రావడము.

యైశ్వర్యమైన సింహాసనమునకు పాత్రుడయిన మందమతులయిన శత్రుకులముల నిర్జించి ప్రకాశించి కడుధీరుండయి బడుగు జనములకు కడుపు నకు కడుపునిడి తొడుగ వస్త్రంబులిచ్చి బ్రోచుటకు కల్పవృక్షమయిన భోగమందు అమరేంద్రుడయిన శత్రువులకు అరవింద బాంధవ నందనుండైన విరాటరాజాధిపుని అర్ధాంగినయిన సుధేష్ణదేవిని గానా రాట్దూతా కింకరజనాధినేత.

వ. తదనంతరము పాండవులు జమ్మివృక్షమునకు పూజించుట.

దరువు॥ అమ్మా విసనె జమ్మీ కొమ్మ మామనవి గైకొమ్మా మా మనవి విల్లానమ్ములు జిమ్మా కొనవమ్మా॥ అమ్మా॥ నేను అర్జునుడూ పెంపొసగానడిగితేయిమ్మా - కానిపరులకు మిగుల గనుపడ తగదమ్మా॥ అమ్మాయిలలో అర్జునుడు మిక్కిలి వలగొనిపూజించి - కులదైవముగ మిమ్ము గొలతురుగదవమ్మా॥ యిరవొందగ అజ్ఞాతావర్షము యిత్తరి జరిపి కురుమతి శ్రీహరి కృపచే కొనిపోదమమ్మా॥ అమ్మా॥

మాటలు. హే శమీవృక్షమా ఈ యజ్ఞాతవాస మొక సంవత్స రము విరాటనగరమందుండి తదనంతరము మిమ్ము పూజించి ధనురాది సాధనంబులు గొని చనియెదము మిగుల స్తుతియించెదము.

వ. అందుకు భీమునకు కోపము సంఘటిల్ల ద్రౌపదితో అనుట.

గీ॥ తాము ధనువులుగొనగ స్వతంత్రులగుట । నేను పరతంత్రుడుగనుండు టేమిచింత । కాని తెలియదు యిటువంటి కౌతుకంబు । వింటివే సాధ్వి ద్రౌపతి విమలనేత్రీ॥

మాటలు. హే ద్రౌపది తాము ధనురాది సాధనంబులకు స్వతంత్రు లగుట నేను అస్వతంత్రుడ నగుట తోచకపోయెను మొన్న సభలో దుశ్శాసనుండు నిన్ను లోలుకవచ్చి వస్త్రాపహరణము సేయు సమయమున వారి ఆజ్ఞాబద్ధులమయి యుంటిమిగాక ఆ సమయమందు అగర్వ ఖర్వ దుర్వారులయిన నూరుగురు దుర్యోధనాదుల పట్టి పట్టున చీల్చి కరిపుర ద్వారంబులకు హారంబులు శాయకుందునా పూరకనే వుందునా తాము మహావీర యోధులయినట్టు నేను అనాథనైనట్లు తోచుచున్నది హే కాంతా సద్గుణ విశ్రాంతా.

ద్రౌపది॥ క॥ శ్రీమహితసకల సుగుణో । ద్ధామవ్రతాపాభిరామదాసవహారదో । స్సీమానువిపులతరబల । భీమా పరాక్రమను నామ భీమబలామా॥

మాట. తాము అజ్ఞాతవాసము చిత్తగింపవలసినది యెందుకనిన తాము అతిపరాక్రమాభి విక్రములనిన్ని అతికోపోద్దీపిత మానసముగలవారలనిన్ని యెంచి యీరీతిగ నుడివినారు వినుమా యిందుకు సంశయింప పనిలేదు అతివిగ్రమ పరాక్రమాభిరామ సుగుణస్తోమ.

వ. పంచపాండవులు మారువేషముధరించి విరటుని పురమునకు బోవుట.

దరువు॥ కంకుడాయను ధర్మరాజుడింకాభీముడువంటకు - శంకిలకావలలునామముతో నపుడూ॥ కంకూ॥ హయగోపరివృత్తులైరీ - నియమమును తోమాద్రిజులు - సయముతో ద్రౌపదీ - సైరంధ్రియయ్యె॥ కంకూ॥ తొలుతా స్వర్లోకమునా ఆ పూర్వశి శాపంబుచే - యిలలో అర్జునుడూ బృహన్నలతానయ్యె॥ కం॥ మురహరుని స్మరియించుచు విరటుని పురమున కేగగ - ధరణీశుడువారల చరణములకు మ్రొక్కెగా॥ కం॥ యిరవొందగ కురుమూర్తి గిరివరమందిరుడైన - హరికృపచేనుండిరీ కరుణతో నపుడు॥ కంకూ॥

వ. విరాటరాజు ధర్మరాజును సన్మానించుట.

మా. ధన్యుడనైతినిస్వామి మిమ్ము పొడగన్న మాత్రాన మున్ను నేజేయు జన్మజన్మాంతరపాపములు నన్ను విడచిపోయెను నాపుణ్యావశంబున మిమ్ముపొడగంటిని సన్నుతించెదను మీరున్న స్థలమెయ్యదియో తెలుపదగు తపోనిధు నమూర్తిపిశదసత్కీర్తి.







ధర్మరాజు విరాటరాజుతో అనే దర్వు.

దంతినగరీశ్వరాయనీ చెంతనుండుమయా॥ దంతి॥ కుంతిసుతుల గొలిచిమేమూ- కొంతదినములు గడిపి పిదప॥ దంతి॥

వర్ణన॥ వినురాజా - దినకర తేజా - కవివరభోజా - కల్పభూజా - వినుమహారాజా॥ కిడ్క॥

మా. కరిపురాధీశ్వరులు మా శిరంబుననున్న వారి యిక్కడికి రాపడమునకు కారణ మేమనిన తెలుపుదువిను రాజా రవికోటి తేజా.

దర్వు॥ వొక్కదినమూ కౌరవాదులూ - పాండునందనులగామక్కువతో నాడిరిజూదములూ - యెక్కువైనరాజ్యమోడీ - సిక్కముగి సోదరులగూడీ - అక్కజముగా వనమునందూ - పెక్కుదినములుండిపిదపా॥ దంతి॥

మాటలు. చూడగను కపటమునను ఆడిరట జూదములు వోడిరట రాజ్యములు పూర్తిగా వినుము రాజా యిందునిభ తేజా.

దర్వు॥ రెండు ఆరు యేండ్లువిపినములో - పండియుమేముండగనూ- యేభూమండలమునా కేగినారో - మెందు అజ్ఞాతముకొరకై పాండుసుతులాగానమైతిమి॥ దంతి॥

మా. క్షత్రియోత్తములు కుంతి పుత్రు లేవురు సర్థరాత్రమందు మేము సుషుప్తి జెందివున్న సమయమున యెందు బోయినారో తెలియదు నందనందనునకే తెలుసును వారిని వెదకుచు యిందు వచ్చితిమి యింకా లేరైరి నేడూ మముకరుణ జూడు.

దర్వు॥ మరుగు వేషములతో బాగా తెరవా సహితముగా - గురుతులూ దెలియకుండగా బాగా - నరిగిరి యీ కరణియనుచూ ధరణి నెల్లా గ్రమ్మరిసీ - పురమునా కేతెంచితిమీ - కురుమతి శ్రీ హరికి దెలుసును॥ దంతి॥

మాటలు. హే విరాటరాజా వినుము రాజసేవ దొరకక మేము భోజనము సేయువారము కాము సహజమిది మాధర్మము పలుకు తెలిపితే నిది ఆశ్చర్యము తోచబడును యీ జగతియందు మమ్ము రక్షించేవారల కానమయ్యా యిది మా ధర్మమయా.

విరాట ధర్మరాజుల వాదం దర్వు.

ధరణీసుర యేవ్వరు నుండుడి మీవర మందిరమందూ యిందూ - యిరువురగ యీ నలుగురికి నరచిదీ యేకార్యములందూ యిందూ॥ ధర॥

మాటలు. వరకంకార్యులవారు వినుడి మా మందిరంబున నుండుటకు యీ నలువురికి యేమికార్యమందు పరిశ్రమ గలవారలు తెలుపదగు తపోవిధిమూర్తి విమదసత్కీర్తి.

ధర్మరాజు దర్వు.

పాకచక్రవర్తి ననేకవిధంబులవీకనొనర్చును రాజా రవితేజా. గో లహాయశిక్షకులుగనీ యిరువురి చేకొనదగు రాజాను తేజా.

మాటలు. హే విరాటరాజా వినుము మున్ను పాండవులకడ నుండు కాలమందు పరిపరిపక్వాన్నాదులు చేయుటయందు భీమునకు సైదోడంద్రు వీని నామము వలలుడంద్రు యీ కలియుగమందు సలరా జనవచ్చును యీతడు నాటకాలంకారముల యందు సలరా జనవచ్చును వినుమా వీని గనుగొనుము యితడు నాటకాలంకారములయందు విద్య ప్రవీణత గలిగినవాడు తక్కిన యీయిరువురు హయగోపరీక్షకులు నేను సర్వశాస్త్ర నీతి పురాణములచేత ధర్మయుక్తమయిన భూసురసన్యాసంబు వహించి కంకార్యులమైనాము వినుము వెస తెలుసుకొనుము.

దర్వు॥ ఘనముగ మీ మన్ననకు పాత్రులము అనవరతము రాజా కవి భోజా - ధనకనకములందున మీసరి అనవరతము రాజా - కురుమతిహరి మమ్మిటు తగ బ్రోచును యిరవొందగ రాజా॥ ఘన॥

ద్రౌపదిదేవి సైరంధ్రి వేషము ధరించి సుధేష్ణచెంతకు బోవుట.

క॥ ఆ పాదమస్తకము త । ద్రూపము నీక్షింపుచును గుతూహలమడరన్।
భూపాలమహిషియిట్లను । నా పొలతుకతోడ నుచిత వాక్యోన్నతిగన్॥

సుధేష్ణ అనుట. గీ॥ పదికులము నామ మెయ్యది యెవ్వరి । దానవేమి పనికిబూని యిప్డు । నేచట బుద్ధిదలచి యేగెద వింతయు । నెరుగ జెప్పు మాకు మెరుగుబోణి॥

ద్విప॥ రాజీవముఖి యింద్రు రాణివో నీవు - తేజమింతని జూచి తెలుపంగ రాదు - సురయక్షగంధర్వ సుదతివో లేక - నర యక్షకిన్నెర నాగాంగనావో - పరికింపగాను మీ పరమేష్టి సతివో - యిరవొంద శ్రీహరి యింతివో లేక - హరుని యిల్లాలివో యతివరో నీవు - మనునిరాణివో చూడ మరిచోద్యమయ్యె - యొంటిగా వచ్చితి వెందుబోయ్యెదావో - యిందురా పనియేమి యిందీవరాక్షి - పేరేమి వూరేమి పెనిమిటి యెవరూ - సారె కులాచార సద్ధర్మమేమీ - నినుగను గొనగానె నెనరుప్పతిల్లె - అనుమానమును మాని అతిశీఘ్రముగను - వినగదెల్పవె కొమ్మ వేడుకలిమ్మా.

దరువు॥ చెలియాబల్కవె చంద్రవదనా - నాచెలిమితోడనుకుందరదనా॥ చె॥ తలిరాకుబోణి నీకులమేమి స్థలమేమి - యిలగృహమ్మరిలను మిక్కిలిచోద్యమయితోచు॥ చెలి॥ పతిసుతహితులు యెవ్వారు - యీ క్షితియందుకలిగివున్నారూ - అతిరూపవతివి వక్కతివిరాకతమేమో రతివో పార్వతివో ద్రౌపదివో చిత్రమ్మయ్యె॥ చెలి॥ అనుమానము విడనాడు - నాతో అనువొందగనుముచ్చటాడూ - కనుగొనినంతనె మనసుసంతసమాయె॥ చెలి॥ సరసిజాననజాగు లేలా - యింతవెరుపేలనే ముద్దుబాలా యిరవొందగాను శ్రీకురుమూర్తిహరిబ్రోమా - తరుణియీధరణి నీకరణి రాబనియేమి॥ చెలి॥

మాటలు. హేఉడు రాజముఖ వినుము తలిరుపాదములు చిలుకలువలె పలుకులు అరబులదోలుతొడలు లఘువృగములేడి చూపులు ధనువులబోలు కనుబొమ్మలు యింద్రనీలములదెగడు ముంగురులు పగడంబులమించు యధరంబు కుందకుట్మలంబుల గేరు దంతంబులు గలిగిన దానవు యిక్కడికి రావడమునకు పనియేమి నీనామమేమి కన్యాకులామణీ సౌందర్యశిఖామణీ.

ద్రౌపతి తన వృత్తాంతంజెల్ల సుధేష్ణతో దెలుపుట.

మాటలు. హే సుధేష్ణామణీ వినవమ్మా సైరంధ్రిజాతి సంభూతను మాలినియను నామంబు గలదానను వినుమా విరాటభూవరుని కొమ్మా.

సుధేష్ణ మాటలు. హే భామామణి సైరంధ్రిజాతి యనగా యేజాతిని యనగా యేజాతి యే నామమో సక్రమముగా నెల్పవే కొమ్మా బంగారు బొమ్మా.

సైరంధ్రి అనుట.

శ్లో॥ సైరంధ్రీపరవేశ్మస్థా - స్వవశాశిల్పి కారికా ఇత్యమరః॥

టీక. గంధలేపనమున్ను తిలకనిర్మాణమున్ను మొదలయిన పనులు చేయుచున్న స్త్రీ పేరు తెలిసి వినుము నిలచి గనుమా.

ద్విపద॥ వినవమ్మ సుధేష్ణ విన్నపంబొకటి - మును పాండవులు జూదమాడినపిదప - వనమునపన్నెండు వత్సరములుండి - చనిరి యజ్ఞాతవాసమునకై విన్న - పాండవులేవురు పణతి ద్రౌపతియూ - నిండు రాత్రివేళ నెటుబోయినారో - ద్రౌపదిదేవిని తగ వెతుకు కొనుచు - ఈపురంబునకిపుడు నే తెంచినానూ॥

దరువు॥ మందగమన సైరంధ్రినేని గృహమందు నుండగ వచ్చితి

పల్లవి॥ సుందరి ద్రౌపతియందు సేవకురాలై - యుందూ నేనందూముందూ - యేమందూ॥ మంద॥

వర్ణన॥ వినువినవమ్మ - విరటునికొమ్మ బంగరుబొమ్మ - కాంతులు జిమ్మ - రతనపుబొమ్మ - సరిలేదమ్మ - మనవినమ్మా॥ కిడ్క..॥

మాటలు. హే మందగమన సుధేష్ణామణీ వినవమ్మ మనవిచేకొమ్మ చంద్రవంశాధిపతులైన పాండవుల అర్ధాంగియైన ద్రౌపదీదేవికి యింపొందేటట్టుగా సేవకురాలనై వుందు నేనందుముందు.

దరువు॥ అడవిలో ద్రౌపదిపణతి వెంబడి నేను పుడమిసంచరించితి నడురాత్రియందు కెక్కడికేగిరో వారూ - కడువాడిగావచ్చితి యిటు వచ్చితి॥ మం॥

వర్ణన॥ తెలిపెదనిందు - ద్రౌపది యందు - సన్నిధినందు వుంటినిముందు - మేమనందు శ్రీహరినిందు - స్తుతియింతుమునను॥

మాటలు. నిన్నటిరాత్రియందు ముందున్న విపినవాసమునందు పాండవులకు యెన్నగా పన్నెండువత్సరంబులు నిండుట తిన్నగాగురించి అజ్ఞాతవాసము జరుపుగావలసి ద్రుపదనందనయైన ద్రౌపదిదేవిని మున్నిడుకొని పతులేవురున్ను కన్నుగవదెరచి చూచినంతలో వారలు గనిపించనందున వెదకుచు వచ్చితినమ్మా విరటునికొమ్మా.

దరువు॥ ఈసమయమున నన్నే విడవని చాల ఆసించుకొనియుంటినే - దాసినయ్యెదను నీ నాసికనుండితే - వాసి కెక్కెదనంటిని నాల్గోటిని కుండ॥

వర్ణన॥ పయోరాజుడు - దరహాజుడు - నాపై నేడు - కనికారజూడు - వినుపించు నేడు - శ్రీహరితోడు - దెలిపెద నేడు॥ కీచక॥

మాటలు. ఈ సమయమందు నిరీక్షించక గ్రాసముసంగి పోషించి నట్టియున దని రెండువత్సరంబులు నీదాసినై యుందు నీగృహమందు.

దరువు॥ విరతాము కురువుమూర్తి గిరిశ్రీనివాసుని - మరువాకనిలచే జనూ - కరుణించి బ్రోవు యిత్తరిని బంగరుబొమ్మ - సుకోదరులు కెల్లసుతోన్న తొనంగదవమ్మా॥ మ ద॥

వర్ణన॥ విరటునియునతి - విరటునియువతి - వినవే నాతి - విశె దఖ్యాతి - నామదిరీతి వృందుహనాతి - సద్గుణయువతీ॥ కీచక॥

మాటలు. హే సుధేష్ణామణి వినవమ్మా నీ గృహమందు సంచార్ల జేయుచు నుందునమ్మా ముద్దుగుమ్మా.

సుధేష్ణ అనే దరువు॥ కొమ్మరో వినుమా - యమ్మరో గనుమా - సమ్మోదంబు గాను సంతసించుమా॥ కొమ్మ॥ చింతాబాసి మా సంతసమున నుండుమా - యింతీపూలబంతీ సౌఖ్యముగా గనుమా॥ కొమ్మ॥ పున్నమ చంద్రునిబోలు నీముఖమూ - వన్నెలాడి నిన్ను గన్నకోర్కె దీరు॥ కొ॥ భూమి కురుమతి భాసురభమతీ - భామ యిచ్చట నుండు భయము బాసియుండగా కొమ్మ॥

మాటలు. హే సైరంధ్రిరమణీ వినవమ్మా వెరపులేక నా మందిరమునను సుఖంబున నుండవె కొమ్మా.



కీచకుని వేషము రావడము.

దరువు॥ తోంతితత్ధాంగుతాంధిమ్మతకధిణుతాంధిత్తాంతిపూత॥

సూత్రధారుని మాటలు. వచ్చినటువంటి వారెవరయా స్వామి హోహో.

కీచకుని మాటలు. వరెవరె పరివారముతో వచ్చి కరములు మొగిచి అతిఆశ్చర్యముగా విచారించెదవు నీవెవ్వరో తెలుపుము వేగ చెప్పెదను బాగ సూత్రధారి మాట ఇచ్చట ముచ్చట బరయువచ్చిన వారల సెచ్చరించుచు రాజాజ్ఞచే యిచ్చటనుండెడి సారథినిగాన తామెవ్వరో తమనామధేయం బెద్దిమో శీఘ్రముగ దెలుపుడి నామనోవాంఛ దీర్పుడి.

కీచకుని మాటలు. ఈ పుడమియందుండు రాక్షస సముదాయము సకు కిరీటియైనవాడును మదించి హుంకరించి నాయెదుట సంచరించె, గర్వో త్కృష్టులైన శత్రురాజుల మదమణంచి మేలు పుడ్డండప్రకాశుల నిర్జించే వేళ రక్షించేవారెవరు పరమేష్ఠి చక్రాదుల పురములుపట్టి యూచి నూ చెను ముక్కంటికి తెలుసు నాబలము రాజదూత జగత్ప్రఖ్యాత.

వరె యీపుడమియందు కడువడిగా ఝుడిసి భవాండములు పోడి పోడిగాగలవు గడగడవణకి తడబడి శిరముడిగొని దృఢమునుబొంది బెగ్గడిల్లి నిడిసపడ రవిచంద్రులు తావులుదప్పిరి వినుమూ నాసాహసంబు గనుమూ.

యింతేకాక పుద్భట పరాక్రమము యొక్క రాజకులమనె పర్వత సముదాయమునకు దిట్ట వజ్రపాణినైన కరిశిరము భేదించె కేసరినైన యీ ధారుణిలో వైరిరాజుల నడంచి విరాటునకు కానుకలొసంగ జేసిన కడు ధీరమతినైన కీచకుండను నానామంబు వినుము, రాజదూత జగత్ప్రఖ్యాతా.

కీచకుడు సుధేష్ణతో అనే దరువు.

క్షేమసమాధానముందూ - అక్కయ్య ప్రేమతో దెల్పుమండూ - యుండూ॥ క్షేమ॥

వర్ణన॥ అక్క క్షేమమా - అక్క క్షేమమా - మీరలు క్షేమమా - బావా క్షేమమా - వినవినవమ్మా - తెల్పవెకొమ్మా॥ కిడ్క॥

మాటలు. హే మానవతి అక్కయ్య వినుము. మీధామమందు సర్వు లు క్షేమమేనా - అకసి నేడు కరుణజూడు.

దరువు॥ ఉత్తరోత్తరగులుగాందూ పోయినగు [illegible] తెన్మ సిందూ చిత్తమిట్లనై పదిందూ - నాయదిల తరము శాంతినొందూ - యుం దూ॥ క్షేమ॥

వర్ణన॥ ఉత్తరోత్తరులు - చిత్రజాతకులు - వృత్తమామతులు ప్రజ్ఞాన్వితులు - చిత్తజప్రబలులు - రాజాన్వితులు॥ కిడ్క॥

మాటలు. గొత్తిగొత్తరుల యొదుటబోయినో యుండలేరా సంపే హించక ముందు నీనండనుల గనుగొందు ఆనందము జెందునా సర్వబంధు వులు కుశలమేన తెలుపు గాన.

దరువు॥ పుడురాజ బింబాననా - వయ్యారి నడురాజ గజగామునా కడు బెళుకుచూపులలనా - గనుగొన్న యొడ నాదుమదినిలుచునా॥

వర్ణన॥ వినవినవమ్మా - యిదియెవతమ్మా - బంగరుబొమ్మ ముద్దులగుమ్మ - కాంతులుజిమ్మ - చక్కనిబొమ్మ - చక్కనికొమ్మ సరిలేదమ్మ - యీసతికురులు - యీసతికుచులు - తుమ్మెదగముల తెరపాతోడలు - అరటులబోలు - యీసతిచనులు - జీవచూగు పణతీకనులూ - కలువలబోలు॥ కిడ్క॥

మాటలు. అక్కయ్య నీ ఆలయమందు నొక్కమదించిన యేను గను దిక్కరించె నడుపు గలిగిన యీ జగతియందు అధిక లావణ్యసుందరి శిఖామణి యిది యెవతి దీనిపృభయ కుచమధ్యమందు నాప్రల్లంబుచక్క రాదేమిసేతు దీని ద్వంద్వకుచ ఘరుషంబుచే నశియించెనో విరహసంతా పాగ్నిచే కరిగెనో దీనిలావణ్య సుధాసముద్రమందు మునిగెనో దీనివయ స్సనే కాంతారంబందు మన్మధుండనే తస్కరుం డపహరించెనో నాకు ఆశ్చ ర్యము తోచుచున్నది అక్కా నాయందు అక్కరదలంచి నన్ను రక్షించుకొన వలెను దీనినా కొనగూర్పవలెను.

దరువు॥ తరుణీయిరుకుచములందూ - నామనసు యిరుపుకొనితిరుగ దిందూయిందూ - బిరుసుతొనరిగి కరిగినదోమందూ - కురుమూర్తి స్ఫూర్తి నెరుగ డేమనందూ - యిందూ॥ క్షేమ॥

వర్ణన॥ యీసఖిమోము - చంద్రునిసమము - తెలిపెద వినుము - నామనవినుమూ - నన్నుగను గొనుమూ॥ కిడ్క॥

మాటలు. యీయింతి కళంకరహితమయిన రాకేందుముఖి సొగసు వయ్యారి మన్మధునిచేతి కఠారి విజితగడగమనకలకంఠికమలనయన దీనినా కొనగూర్చు నామది సంభ్రమముదీర్చు.

సైరంధ్రి సుధేష్ణతో అనుట.

దరువు॥ వచ్చినవారెవ్వరెకొమ్మా - నచియింపవమ్మ॥ ప॥ చూట యుతముదాచకచ్చె జాచియు దురాచకముల - కీచకుడని పలుకగాదగునా రాచవాడలోనా॥ వచ్చి॥

వర్ణన॥ చూడుమునాడు - పలుకొసిపోడు పైబడునప్పుడు - నెడిసోతాడు - నీతమ్ముండు - తెలియగలేడు - దుర్మార్గుడు॥ కీచ॥

మాటలు. యీ రాచనగరిలోపల సతులజూచి నిలువనోపక నీచ వాక్యాలు బలుకుట కీచకునకు వుచితమేనమ్మా కూడదని తెలుప తగునమ్మా.

దరువు॥ ఇంతిగోబలవంతులు నాకాంతులు గంధర్వులేవురు - దుర్మంతుర నను తెలియగలేదా - నిర్భ్రాంతుడీడా॥ వచ్చి॥

వర్ణన॥ ఘనసాహసులూ - ఘనసాహసులూ - ఘలసితంబులూ - బలసంయుతులూ - దేవాకృతులూ - దుర్జనహంతులూ - గంధర్వులూ॥ కీచ॥

మాటలు. ఇంతేగాక నాకాంతులు మహాబలపరాక్రమవంతులు గంధర్వులు యేవురుగలరు దుర్మదులద్రుంచి వేతురు తెలియజాలవు వ్యర్థముగా చెడిపోగలవు.

దరువు॥ గురుతరముగ కుజమాతి శ్రీహరిని సన్నుతించియనుచు గుణయుతనెపుడు తెల్పవె తరముగాదనవు॥ వచ్చి॥

వర్ణన॥ వినువినునాతి - వీనికినీతి - లేదెఖ్యాతి - తెలుపుమురీతి - యిద్ర్రప్రఖ్యాతి - కురుమతిహరినె - కురుమతినె - నమ్మితిమదినె యిటుల సదగునే॥ కీచ॥

మాటలు. శ్రీకురుమూర్తి హరిని నిరతము నమ్మిన తరుణీమణి యని తెలుపదగునమ్మా బంగరుబొమ్మా.

సుధేష్ణ కీచకునకు బుద్ధి జెప్పుట.

దరువు॥ శోకవరాళి॥ పరనారీమణులాయీ పగిదిమోహించుట తరమేమన్నా - శిరియునాయువుదినాక్షీణించుతమ్ముండ తెలియవన్నా॥ ప॥

వర్ణన॥ వినువినవన్నా - యిదితగదన్నా - పరస్త్రీయన్నా యెవ్వరు విన్న నవ్వేరన్నా - నామనవివిన్నా - మేలగునన్నా॥ కీచ॥

మాటలు. పరస్త్రీదోషముచేత బహుమంది హతమైపోయినారు పరస్త్రీల గవయుట పరద్రవ్య మపహరించుట పరనిందలు సల్పుట యీ అపరాధులకు దూరమకాదురని పెద్దలు బలుకుదురు వద్దుపోవన్నా బుద్ధివినవన్నా.

దరువు॥ అందారివతె నొక్క ఆడుదానికె యింతాయెందుకన్నా - గంధర్వులేవురు గలరు దీనికిపతులు తెలియవన్నా॥ పర॥

వర్ణన॥ వినుమినురోరి - యిదిపరనారి - మానసిక... - ...
దోషకారి దుష్టాచారి - యేలర వోరి॥ కీచక॥

మాటలు. యీలోకమందు అనేకస్త్రీలుగలరు అందరివలెంబు ... ఆడది యిదిగాక గంధర్వులసతి యిది యందరవలెకాదు మందగ ... దండనకు లోబడకు తమ్ముడా చెడకు.

దరువు॥ కన్యాదాసీలునీకూ యెన్ని కావలసినా వున్నారన్నా ... భామలబొంది హితమయ్యే బోవుట యెందుకన్నా॥ కన్యా॥

వర్ణన॥ నాగృహమందూ - కోరినవిందూ - వున్నారిందూ - ... సుందు - కోరిమియిందూ - చూడుమియిందూ - ... కీచక॥

మాటలు. అనుజా నా మందిరంబులో నీవపేక్షించిన ... కూరిలించెద వినుమా సుఖము గనుమా.

దరువు॥ ఇచ్ఛలేనియింతి నెనయాగ అపకీర్తి వచ్చునన్నా - ... కురుమూర్తి - హరియునీమాటలు మెచ్చడన్నా॥ తర॥

వర్ణన॥ దీనిపతులూ - బలసంయుతులూ - దేవాన్వితులూ - ప్రజ్ఞాన్వితులూ గంధర్వులూ - విలసితనుతులూ॥ కీచక॥

మాటలు. వరె మూఢ యిచ్ఛలేనటువంటి మచ్చకంటిని ... వచ్చును అపకీర్తి మెచ్చడు మురమూర్తి అచ్యుతుడు వూర్తి.

కీచకుడు సుధేష్ణతో అనుట.

దరువు॥ భామామణియీమానిని - కామించితిభోగింపను॥ ... నోమునునోమినా నోముఫలింపగ - వేమారును నామానస మేమా... కామునుజేసె॥ భా॥ అక్కరో యీచెలి చక్కనిదానిగనీ - ... మును - తిక్కమొగ మొక్కజేసె॥ భా॥ చానమొగముజాలు ... మామనుబోలు - దీనిబోలుదాని పనిబూని దివిగానిగన॥ భా॥ ... కురుమతిభామునకభినుతి - ప్రేమామున నామానసకామమునులుదీని ...॥ భా॥

సుధేష్ణ కీచకునకు తిరుగా బుద్ధి జెప్పుట.

దరువు॥ మన్నించినామాటవినుమా అన్నా యింటికిజనుమా ... ప్రతిను నీవాసింపగబోతె పాపమగ్గలమౌను గనుమా॥ అన్నా॥

వర్ణన॥ అన్న వినరా అన్న వినరా - నాయన్న ... యింటికి జనరా - యిది హితమటరా - తెలిపెద వినరా - తమ్ముడ ...రా॥

మాటలు. తమ్ముడా వినుము. ఆహా మమ్మునేసించిన అన్యా... మునుగా మాటలు బలుకకుండుము నిక్కముగ నక్కనారిణ్ము ...

పని చెప్పి మేమే వెరతుము. నీ మనస్సునకు తెలియక మదోన్మత్తత చేత యీ
నోను యీలాగు బలుకుట మరియాద కాదు, దుష్టా, పరమ పాపిష్టా.

దరువు॥ దుర్మార్గులను యమధర్ముడు శిక్షించు దుర్మార్గ నిదియోట
యోలవినుమా - అన్నా యింటికి జనుమా॥ మన్నించి॥

వర్ణన॥ దుర్మతుడంచూ - యెముడు నెంచూ హరిశిక్షించు తెలి
పెదనంచూ తెలిపెదవినుమా - సుఖమూ గనుమా - నన్నూగనుమా॥
కిడ్క॥

మాటలు. వరే దుర్మార్గ వినుము. ఈ ధారుణియందు దుర్మార్గుల
యిన పురుషులను యముడు శిక్షించును నీవాపె నపేక్షింపక జనుమూ నా
మాట వినుమూ.

దరువు॥ పరసతిబొందిన దురితాము లేతెంచూ - కురుమూ త్రిహరి
మెచ్చుపినుమా - అన్నా యింటికి జనుమా॥ మన్నించి॥

వర్ణన॥ హరిమెచ్చడూ - హరిమెచ్చడూ - శ్రీహరి మెచ్చడూ -
మతిలో మెచ్చడూ మతిలో మెచ్చడూ శిక్షించగలడు - వినునాతోడు -
బ్రోవగలడు॥ కిడ్క॥

మాటలు. బలాత్కారము చేత పరసతులను బొందిన పాప మగ్గల
మానూ వినుము నేడు తెలిసి చూడు.

సుధేష్ణకు కీచకునికి వాదం దరువు.

కీచ॥ అక్కరో వినుమా - అతివరో గనుమా - వెక్కు మాటలాడ
నీకు ప్రియము గాదమ్మా॥

సు॥ అనుజా వినరా - ఆత్రమేలరా - మనసు నిల్పజాలవింత మరు
లుచాలుర॥

కీచ॥ యింత చక్కనీ యింతినీ గని - మంతనమున నోర్వజాల
మానినీమణి॥

సు॥ గరుడగమనునీ కురుమతీశుని - నిరతము మది మరువకాను
స్మరణ జేయుమా॥

తిరుగా కీచకుడనె దరువు.

యెన్ని జెప్పిన విననమ్మా - యీ వన్నెలాడిని విడువా నమ్మా॥ ప॥
మన్ననతోడ నీ సన్నిధిలోపల వున్నందుకే నేను నిన్ను వేడితిగాని॥ యె॥
యెంతో చక్కనిదీ ఈ యింతీ - మరునికాంతిసగూ పూలబంతీ - మంతాన
మునకు నామందిరమున నుంచె - కాంతలలోన మన్నింతు యీ కాంతనూ
యెన్ని॥ సీ॥ ...లి మోహమాయే - యెమెము తెలుపరానిది చిత్రమూ

యే - అలుకపడక నన్నూ ఆదరించవమ్మా - తెలుపుదు కుసుమగాత్రి తెలిసేటట్లుగ నీకు॥ యెన్ని॥

వ. కీచకుడు సైరంధ్రిపై మోహముచే తత్తరపడి ఆ సుందరీ మణిపై బడు సమయము గురుతెరింగి సుధేష్ణ కీచకునకు మరుగు మాటల చేత నీ తాపునకు పంపించగలనని నుడివిన కీచకుడు పోయిన తనుపగ నాప్రియపతితో యిట్లనియె.

దరువు॥ పోపోగదే - పోగదే సైరంధ్రి వేగా॥ పో॥ దాపురమైనాను రా దామకరాగా వేగా॥ పోపో॥

వర్ణన॥ వేగమెపోవే - సురగొనితేవే - అమ్మయ్యా పోవె బరువడి రావె తడువేలపోవె - నామన వినవె॥ కిడ్కు॥

మాటలు. పణతి సైరంధ్రి జనశిరోమణి వినుము నా తమ్ముడైన కీచకుని సదనమునకుబోయి ఈ గిన్నెలో సురగొనితేవె మధురవాణి పున్నాగవేణి.

దరువు॥ రత్నపుగిన్నెలోన అతిమధురాపూసురా - జతనముగానూ దేవె అతివ సైరంధ్రివేగా॥ పోపో॥

వర్ణన॥ పిలచినచాలా - పిలచినచాలా - పలుకవేలా అలుగుటమేలా తెలుపవెబాలా - వలువదుహేల - నిలుకడలేలా జేయగమేలా॥ కిడ్కు॥

మాటలు. వజ్రవైడూర్య నీలగోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య స్థగితమైన యీ చషకములో మిక్కిలి అమృత తుల్యమయిన మదిర పదిలముగదేవే మదకరిగమన యిందునిభ వదన.

దరువు॥ ఘడిఘడియాకూ నోరూ తడియుడిగీ నాదికా- నిడిదిగూడను వేగా కడువడినడుగిడూ॥ పోపో॥

వర్ణన॥ దయరాద - దయరాద - నామీద దయరాద - నేడగ లేదా - కొనియాడగలేదా - నాతో వాదా॥ కిడ్కు॥

మాటలు. కడువడిగా నడుగులిడులిడు విడువు నీయడలనున్న అనుమానము నోరు తడియుడిగినది నిడుదిగూడదు తడయనేరను కడువేగ జనుమూ నామాట వినుము.

దరువు॥ కురుమతీశునికృపాశిరమునధరియించి- నాయువరజునింటికి బో యి - సరగునాసుర దేగా॥ పోపో॥

వర్ణన॥ హరికృప వేగా - హరికృప వేగా - శిరమునబాగా - ధరియించివేగా - పోగదెవేగా॥ కిడ్కు॥

మాటలు. హే కీరవాణి నా మనవాలకించి సుక సీవతి శీఘ్రముగా దెమ్మా నామాట సమ్మా.

సైరంధ్రి సుధేష్ణతో అనుట.

దరువు॥ ఏమనవలె నిక ఏమని తెలుపుదు - భూమిపాలు రాణీ కోమలివిభునితో॥ ఏమ॥ నీచపు మాటలు కీచకుడాడగ - చూచినదానవిటుదాచగనేటికి॥ ఏమ॥ నమ్మతీగానిను నేమనములోపల నమ్మినదాననిటుబొమ్మని పలుకుట॥ ఏమ॥ పరిపరివిధములా - మొరలిడ నీమది - కరుగదు కురుమతీ హరి మెచ్చుడీరీతి॥ ఏమ॥

సుధేష్ణ సైరంధ్రితో అనుట.

దరువు॥ మదిరెదేగా పోగాదేవేగా - అతిముదముతో బాగా॥ మ॥ ప॥ పదవేలనుజుని సదనమునకు వేగా - సరగునసురదేగా॥ మ॥ యిన్ని దినమూలూ నా గృహమందూ - హితురాలనుకొంచూ నున్న నాతో మాటవినావమ్మా- మగువరో యేమందూ॥ మ॥ పంతమేలాయింతినాతోడా- యింతకులోగానూ - యంతదెలుపాగాను వినవికనూ॥ మ॥ తరుణిరో నామాటచేకొమ్మా - తలచెద విక సుమ్మా కురుమతి శ్రీహరిని నెర నమ్మా॥ మ॥

మాట. ఇన్ని దినములు నా గృహమునందు నున్న దానవనిన్ని నా హితురాలవనిన్ని అత్యంత ప్రియురాలవనిన్ని కేవలమున నమ్మికగలదాన వనిన్ని అతిరహస్యమైన ముచ్చట తెలుపనైనది, యెందుకనిన యీ ధాత్రియందు మధ్యపానము నిషిద్ధమని పెద్దలు దూషించెదరు మిక్కిలిగా గోప్యముచేత తెలుపనైనది సైరంధ్రి వినుమూ అతి శీఘ్రముగా జనుమూ.

సుధేష్ణతో సైరంధ్రి అనుట.

దరువు॥ యెటువలెబోదునెకొమ్మా - నేనెటువలెబోదునెకొమ్మా॥ప॥ నీచుడైనయాకీచకుసదనము - యెటుబోదునె - యెటుబోదునె॥యె॥ సింహబలునిసదనంబునకునే - యిమ్ముగనేపోజాలనే॥ యె॥ పరిపరివిధముల మొరలిడునామది - కరుగదు కురుమతి హరి సాక్షిగనే॥ యె॥

సైరంధ్రి సుధేష్ణతో అనుట.

తగదమ్మా నను బొమ్మాసిపలుకుమాట॥ త॥ ప॥ మగువారో పగతూ నీమందిరమునకునూ॥ త॥ వినలేదా కీచకుడాడుమాటలు వినలేదా - మన మూనక నికరముమానీ యేటికి [illegible] యింటా నిలచె వేళలో తోలుతానే చులకాని పనులు [illegible] లేదా॥ త॥ సైరంధ్రీ జాతుల వారి కేందైన సైరంధ్రి [illegible] పిగులగూర్చుటగ్గాని సురదేగా ధూమ్యమూ॥ తగ॥

